





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

## శాంతి దీపిక





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120012687

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శాంతి దీపిక

(కవితా సంపుటి)

సాహిత్య రత్న

**సందాపురం బిచ్చయ్య**

సీనియర్ హిందీ పండిట్

**శ్రీ లక్ష్మీనరసింహస్వామి పబ్లికేషన్స్**

నాగవరం గ్రామం, వనపర్తి మండలం,

మహబూబ్‌నగర్ జిల్లా - 509 103

# అంకితము



సర్వశక్తి స్వరూపిణి అక్షర మాతృమూర్తి

సరస్వతీ దేవి

పాదారవిందములకు

ఎస్. బిచ్చయ్య

గ్రంథకర్త

# జయోస్తు !

పొద్దుపోక నేను సుద్దులు రాయను
ఎదుటి వారి మేలు ఎప్పుడైన
కోరుచుందు చాలా కూరిమితోడను
అంతకన్న మిన్న ఆశలేదు
అన్న సందాపురం
అలవోకగ పండిన నిండు సాహిత్యపురం !

పేరున మాత్రమే బిచ్చయ్య కాదు
తీరున కూడా భిక్షుపతియే సందియము లేదు
దత్తుడేమో, అందుకే అయినాడు సాయినాథుడి ముద్దుబిడ్డడు
వాగ్దేవీ పుత్రుడేమో, కాకున్న కాగలడా కవివరేణ్యుడు !

స్ఫూర్తి దీపిక అనినాడు
జ్ఞాన దీపిక అనినాడు
నేడు ఏకముగా శాంతి దీపిక అనుచున్నాడు
కడుంగడు ఆత్మానందమున ముంచి దేల్చుతున్నాడు !

కవి, కథకుడు, కళాకారుడు
ఉన్నతుడు, ఉత్తముడు, ఉపాధ్యాయుడు
నిగర్వి, నిరాడంబరుడు
నిండుమనసువాడు, నీడై నిలుచువాడు
మరచిపోలేని వాడు, మంచి మిత్రుడు
మనసున నిల్చు వాడు, మంది మేలు కోరువాడు
అక్షర ఋషి సందాపుర వాసి !
ఆనంద బ్రహ్మర్షి సుభద్రమ్మ ఆత్మనివాసి !

- డా॥ గుమ్మనూరు రమేశ్‌బాబు

# పల్లా నారాయణ శర్మ,

## రిటైర్డు తెలుగు పండిట్ వనపర్తి గారి ఆశీస్సులు

క॥ ఇదిమానవ ధర్మంబును
కుదురుగ నేర్పరచినట్టి కూరుపు విలసత్
హృదయముగల సహృదయులు
ముద మొదవ సమస్త ధర్మ ముక్తం బయ్యేన్

క॥ మనధర్మము మన కర్మము
మన సంస్కృతి విస్తరించి మనె ఈ కృతిలో
మన నిచ్చయ కవి మిత్రుల
మన సెట్టిదొ అర్థమయ్యె మాన్యులు మెచ్చన్

క॥ కృతులతో బహుసత్కృలతో
కృతియై వర్ధిల్లి సత్కవీంద్రు పదవితో
శత సంఖ్యా కరచనలతో
మతి మంతుడు నిచ్చియకవి వర్ధిలునిలలో

- పల్లా నారాయణ శర్మ
రిటైర్డు తెలుగు పండిట్
వనపర్తి

# విజ్ఞప్తి

సీ॥ ప్రేమాను రాగాలు పెరిగి యున్నప్పడే
మతిమాయమై పోవు మరుగు లేక
గతికి గాయంబై ప్రగతి పతనంబగు
ఎట్టివారికినైన ఎన్నడైన
ప్రేమను పెంచిన పేమ్రను త్రుంచిన
కైలాస పతియైె కష్టపడును
అతియేది యున్నను అతిహాని కల్గించు
మితమైన దేదైన మేలుజేయు

సీ॥ ఆత్మచెప్పిన మాటలే ఆలకించి
మనసు చెప్పిన మాటల మరచిపొండి
చదువులోపల యున్నట్టి సారమిదియె
చెప్పచున్నాడు బిచ్చయ్య చిన్నమాట

సీ॥ చావు పుట్టుకలేని సందాపురం వాడ
స్వార్థ చింతనలేని సాత్వికుడను
ఏ యుగమందైన ఏ దేశమందైన
పురుష జన్మమునందు పుట్టుచుందు
పక్రృతి యందలి ప్రతి వస్తువు నందున
పరమేశు లీలలే పరిగణింతు
ఎవ్వరేమన్నను ఈశ్వర వాక్కుగా
గమనించి మెలిగెడి గట్టివాడ

సీ॥ సచ్చిదానంద సామ్రాజ్య చక్రవర్తి
కరుణ నా పైన యుండుగా కలి యుగాన
మేలుకలుగును ఎప్పడు మితముగాను
సత్యసాయికి బిడ్డను సత్యముగను

- సందాపురం బిచ్చయ్య



నా రచన 'హిందీ అధ్యాపక్' గ్రంథావిష్కరణ సందర్భాన వేద పండితులు బ్ర॥వే॥ హరిలక్ష్మీ నరసింహశర్మ గారు అందజేసిన అశీస్సు

– ఎస్. బిచ్చయ్య

## శ్రీ రస్తు
## శుభాశిషః

1. హిందీ భాషాధ్యాపకః యస్ బిచ్చయ్యః కవి పండితాః
హిందీ భాషా ప్రచారేణ వర్ధతామాంధ్ర సోదరః

2. "హిందీ భాషాముచ్చరంతః హైందవా" ఇతి నూతనమ్
సిద్ధాంతమున్నయ స్మిత, రాజతాం నూత్నమార్గమః

3. సంగీత మార్గానుసరణ మక్షర జ్ఞాన సాధనమ్
సుకరం స్యాదితవదన్ బిచ్చయ్యః సంప్రశస్యతే

4. హింది అధ్యాపక ఇతి గ్రంథావిష్కరణోత్సవే
హరిలక్ష్మీ నరసింహః అశీఃప్రకురుతే స్వయమ్

5. సభాధ్యక్షాశ్చ సుధియః సుహృదశ్చసభాసదః
బిచ్చయ్యమ్ గ్రంథ కర్తారం అభినందం తీతి సర్వశః

పాలమూరు
3-11-199

ఏవః
సర్వశ్రేయోభిలాషకః
హరిలక్ష్మీ నరసింహ శర్మ

## మరొక్కమాట

శ్రీయుతులు, ప్రియాతి ప్రియమైన ఆత్మీయులకు హృదయపూర్వక ప్రణామములు సమర్పిస్తూ మరొక్కమాట వినిపిస్తున్నందులకు విసుగుజెందక వినవలసినదిగా మరి మరి కోరుచున్నాను.

గీ॥ అచ్చు వేయించి పుస్తకం అమ్ముకొనియు
ఆస్తి అంతస్తు పెంచియు హాయిగాను
బ్రతుక వలెనను కోరిక మతికి లేదు
మానవాళిపైయున్నట్టి మమత వలన
చింత దీర్చెడి విషయాలు చెన్నుగాను
జాతిసేవలు జేసెడి జాలితోడ
వ్రాయుచుందును వాగ్దేవి వరము వలన
చెప్పుచున్నాడు బిచ్చయ్య చిన్నమాట.

మీ ముందున్నట్టి "మానవ ధర్మం" పుస్తకం ద్వారా నాకు తెలిసినంత వరకు పద్యాలు, పాటలు, గేయాలు వ్రాసి వినిపించుటకు ప్రయత్నం చేసినాను. ఇందులో మానవజాతి మనుగడకు సరిపడని మాటలున్నచో వెంటనే లేఖ ద్వారా తెలుపవలసినదిగా మరి మరి కోరుచున్నాను.

ఇందులోని విషయాలు అందరికి ఇది వరకే తెలిసియుండవచ్చును కాని, మంచి విషయాలు మళ్ళీ మళ్ళీ వినడంలో మనసులోనే ఉండిపోయి మంచి మార్గమున చరించడానికి అవకాశమున్నది. సమాజంలో సత్యధర్మ శాంతి ప్రేమలు ప్రబలి దేశంలో ప్రశాంతి చేకూరుతుందనే ఆశతో వ్రాశాను.

## "చిన్నిమాట"

సీ॥ సంగీత సరసాన సాహిత్యమందున పరులను మెప్పింప ఫలము లేదు
కఠిన పదాలను కంఠస్థమునుజేసి గానంబుజేయుట ఘనత గాదు
ఆశువు పద్యాలనల్లియునుల్లముల్ రంజింప జేసిన రక్తి లేదు
వ్యాకరణంబును వడబోసి వ్రాసియు విద్యార్థులకు నేర్ప విలువలేదు.



గీ॥ మానవత్వమునకు యున్న మహిమలెల్ల
చాటుచుండిన కవులకు చాల వరకు
పుణ్యమబ్బును పూర్తిగా పుడమి యందు
దేశసేవను జేసెడి దేవుడతడె చెప్పుచున్నాడు బిచ్చయ్య చిన్నిమాట

సీ॥ మానవ హృదయాల మానవత్వంబుచే
నింపిన నీ కీర్తి నిలుచు జగతి
అట్టి సాహిత్యంబు అందింప ప్రజలకు
పాండిత్య ప్రతిభకు ఫలము దక్కు
పుణ్య కార్యాలలో పురుషార్థమును దెల్పి
పాపభీతిని పెంచి ప్రజలలోన
దేశశాంతి కొరకు దివ్య సందేశముల్
వినిపింప సత్కీర్తి విలువ పెరుగు

గీ॥ మనిషి ఎదనింద నింపగా మానవతను
పతనమను మాట రాదింక ప్రజలలోన
కవుల కలమందు నున్నది కలియుగంబు
చెప్పుచున్నాడు బిచ్చయ్య చిన్నమాట

సీ॥ కవితలుజదువుచు కరతాళధ్వనులను
మిన్నుముట్టించిన మెచ్చరెవరు
అందాలరాశివై. అందలమెక్కియు
నాట్యమాడినగాని నచ్చరెవరు
భజనలు చేయించి భక్ష్యభోజ్యంబులు
పంచిపెట్టుట వల్ల పరువు రాదు
రాజ్యాలు పాలించు రాష్ట్రపతికినైన
మానవత్వము లేక మసల లేదు

గీ॥ మానవ వికాసమొనరించు మర్మమెల్ల
తేట తెల్లము చేసియు తెల్పుటకును
మనిషి గుణముల చాటగ మౌనమేల
కవుల కలమందు నున్నది కలియుగంబు
కలిసిరండిక కవులెల్ల కలము బట్టి
మనిషి మదిలోన యున్నట్టి మలిన బుద్ధి
వెళ్ళిపోయెడి మార్గంబు వెతికి చూప
నడుము కట్టండి యిప్పుడే నవ్వుకుంటు
జాగు చేయక వ్రాయండి జంకువీడి
కోరుచున్నాడు బిచ్చయ్య కూర్మితోడ

ఆ.వె. భూమియందు పుట్టి భూమిలో జేరును
పుడమి నేదియైన పూర్తిగాను
చావు బ్రతుకు మధ్య చక్కని సంతుష్టి (అనుభూతి)
మానవత్వమొకటె మరవ వలదు.

మనసును మెప్పించి ఒప్పించి విషయాలను మరి మరి వినిపంచవలసి వస్తుంది. సచ్చింతనను ఉత్పత్తి చేయుటకు దోహదపడు పదాలను చదవడం వల్ల మనసుకు ఆనందం లభిస్తుంది మరియు అప్రయత్నముగానే ఆచరించడానికి ఒప్పుకుంటుంది మనసు. కావున నేను పండితులతో ప్రార్థిస్తున్నాను.

ఉ॥ పండితులైనవారు పరిపక్వమనస్సున ఎల్లవేళల
న్నుండియు మంచి కావ్యముల నొక్కటి రాసిన చాలు. జన్మలో
కండలనిచ్చె దేవుడు సకాలమునందు సుకర్మ జేయగన్.
పండుగజేయు మెప్పుడును భారత సంస్కృతి చాటిచెప్పుచున్
దండిగ డబ్బు పెంచియును దాచిన పాపము వచ్చు తప్పకన్
దండిగ డబ్బులిచ్చినను దారసుతాదులు మెచ్చరెప్పుడున్
గండము తీర్చు జాతికిల కల్మషబుద్ధుల మంట గల్పియున్
మెండుగ మేలుజేయగల మేలిమి కావ్యము చాటు పండితా!

# జన్మభూమి

ప॥ మాజన్మ భూమికి మానవ హారాలు
మమ్మేలు తల్లికి మనసార ప్రార్థనలు

చ॥ కడుపులో కల్మషము కాల్చివేయుము మాలో
కులమత భేదాలు కూల్చివేయుము తల్లి
గబగబ మా ప్రగతి పెరిగి పోతుంటేను
కలిమి బలిమి చేత కలిసి పోతుంటాము
కరుణతో మమ్మేల్ల కాపాడుమో తల్లి ॥మా॥

చ॥ వృక్ష సంపద పెంచి వర్షాలు కురిపించి
కర్షక కోటిని హర్షింపజేయగ
ప్రాథమిక విద్యలను ప్రతి వారికిని నేర్ప
ప్రతిన బూనియు మేము నీ ముందు నిలిచాము
దయతోడ మమ్మేల్ల దీవించుమో తల్లి ॥మా॥

చ॥ పరిసరాల పరిశుభ్రతయే
పరమేశ్వరుని పూజయే యనుచు
తట్టలు పారలు చేతను బట్టియు
వట్టి మాటలను కట్టియు బెట్టియు
గట్టిగ సేవలు జేయ బూనితిమి
నీ ముద్దుబిడ్డల కీర్తి నిలుపుమోతల్లి ॥మా॥

చ॥ వికలాంగులకు తగిన వసతులను కల్పించి
పుట్టబోయే బిడ్డ గట్టితనము కొరకు
నిరుపేద గర్భిణులకు మందులిస్తున్నాము
దిక్కుమొక్కులేని దీనులకెల్లను
వృద్ధాప్య పింఛనలు పంచిపెడుతున్నాము
మంచి మనసుతోడ మమ్ము బంపుమోతల్లి ॥మా॥

చ॥ ఆర్థిక హీనుల ఆదుకొనుటకునై
ఆడవారల నెల్ల ఆదరించుటకునై
జాతిని నీతిగ నడుపుట కొరకై
ఉన్నత పథకాలు మతితోడ వేశాము
ప్రగతి మార్గమున మేము పయనించుచున్నాము
ప్రేమతో మమ్మెల్ల పాలింపుమోతల్లి ॥మా॥

జై జన్మభూమి . . . జై ఆంధ్ర జననీ....

# తెలుసుకొని తిరుగుము

ప॥ ఎన్నాళ్ళున్నను మానవ దేహము మహిలో నిల్వదురా!
జాతిసేవకై పాటు పడిన నీ నామమె నిలుచునురా!

చ॥ నామము బెట్టియు నియమము దప్పిన నీచుడవీవేరా
ఇలపై తెలివి హీనుడ వీవేరా!
మానవ గుణములు గల్గినవాడే మాధవుడై
ఇలవెలయునురా
వేద శాస్త్రముల సారమిదేరా, వాదన జేయగ బూనకురా

చ॥ మజీదు మందిర్ చర్చ్ లోపల ఖురాను బైబిల్ భగవద్గీత
చెప్పిన సూక్తులు ఇవియేరా!
గొప్ప కులమున బుట్టితిమనుచు కుప్పిగంతులు వేయకురా
అధికారంబు నాకు ఉన్నదని వితండ వాదన జేయకురా
చిత్తము గొప్పగ లేకయున్నచో చిత్తొత్తుగ చెడిపోదువురా
శాంతము తోడను పరిశీలించిన, అందరు నీవారౌదురురా
గోల్డు మెడల్సులు గొట్టితిననియు, మేడల నెక్కియు
మురవకురా
పేదల బాధల పాలు పంచుకొనియు స్వర్గసుఖమును
పొందుమురా
డాక్టరు బిరుదులు పొందితిననియు, యాక్టరు పోజులు
గొట్టకురా
ప్రాక్టికలుగా నీ పదవులలో, యాక్టివ్ తనమును
చూపుమురా.

# ఉనికి చాటుకో

ప॥ హే మిత్రమా! ఉపాధ్యాయ రత్నమా!
భరతమాత ప్రథమ పుత్రమా!
అజ్ఞానులందరికి అక్షరాలు నేర్పించి
సుజ్ఞాన సంపన్నుల జేయునట్టి దైవమా ॥హే॥

చ॥ కుమతులెంత కూయుచున్న కుముల బోకు కుక్షియందు
లెక్కజేసి చిక్కిపోకు చక్కజేయ జూడు నీవు
తల్లి దండ్రులెంత నిన్ను తరుమ జూచుచున్నను
పిల్లవాని నెప్పుడైన పీడింప జూడకు ॥హే॥

చ॥ కల్లబొల్లి కథలు జెప్పి ఒళ్ళువంచనేర్పుమా
ఇంటి పనులు ఎన్నియున్న కర్తవ్యము మరువబోకు
తంటాలకు తలయూపకు కొంటెవారి జంటవదులు
పసిపిల్లల పసిడిమనసు పొసగజేసి పొందు సుఖము
వ్యసనాలకు లొంగినీవు మసలబోకు మనసునందు
గుసగుసలు చెలరేగును, ఊరినిండ గేరినిండ
దుర్వ్యసనం విసర్జించి భరతమాత పేరు నిలుపు. ॥హే॥

*

# ఆహ్వానం

ప॥ వచ్చెను మనకు స్వాతంత్ర్యం
విచ్చెను నూతన కాంతులు ఎన్నో
కాంతుల మధ్యన కదం ద్రొక్కుచు
పదండి భారత పౌరుల్లారా!

చ॥ పాటలు బాడుచు ప్రభాత భేరిని
మ్రోగించండి మోజులుదీరగ
భక్తితొ మీరు భారత మాతకు
జైహింద్ జైహిందనరండీ! ॥వచ్చె॥

ఒక వేయి తొమ్మిది వందల
నలభై ఏడు ఆగష్టు నెలలో
తేది పదనాల్గర్ధరాత్రిలో
వెదకుచు వచ్చెను స్వాతంత్ర్యం ॥వచ్చె॥

గాంధీగారి అఖండ దీక్షతో
సుభాసుగారి చురుకుదనంతో
ఆంధ్రకేసరి అడుగు జాడలో
నర్తకి అజీజ్ ఆత్మబలంతో

కలిమితోడను బలిమి తోడను
లేమికి స్థానం ఇవ్వగూడదని
కలసీ మెలసీ కలకాలం
ఇలలో మనము మెలగాలని. ॥వచ్చె॥

# పిలుపు



ప॥ విద్యార్థి సోదరా బావి కాల పౌరుడా
జాతి సేవ జేయ నీవు జన్మమెత్తినావురా

చ॥ జాగుయేల లేవరా జెండాను ఎత్తరా
జాతీయ పర్వదినం జైహిందని పాడరా
ప్రజలలోన చైతన్యం ప్రబలినట్టి శుభదినం
తెల్లవారు మనదేశం వీడినట్టి భవ్యదినం
జాతిపితా గాంధీని శాంతిదూత నెహ్రూను
జాతిమాత సరోజని సహనశీలి సర్దారును
స్మరణజేయ వేగరార సంబరమున సాగిరార
జాతీయ నేతల ఆత్మఘోష ఫలితంబే
మనకంతా స్వాతంత్ర్యం మనకెంతో ఉల్లాసం
స్వాతంత్ర్యపు రథము నడుప సారథివి నీవేరా
ఈ దేశం నీదేరా! ఈ రాజ్యం నీదేరా. . .



# మతితో మెలగుము

ప॥ విద్యార్థీ సోదరా వీరమాత పుత్రుడా
బంగారు పండునట్టి భరత భూమి నీదేరా!

చ॥ సిరిసంపద తులదూగే అన్నపూర్ణ మనదేశం
దారిద్ర్యము దునుమాడే దండ ధరుడ వీవేరా!
తల్లిదండ్రి తలపులను తలదన్ని తిరుగబోకు
క్రమశిక్షణ తోడునీవు కలకాలం మెలగుమా!
గురువుగారి బోధనలను గుండెలోన దాచుమా!
కండపెంచి కలిమిపెంచి కాలాన్ని ఎదురించకు

చ॥ కులము మతము లెంచకుండ కలిసి మెలిసి బ్రతుకుమా
విద్యలేక నీవు ఎపుడు విజ్ఞానం పొందలేవు
ప్రాపంచిక సుఖము గోరి ప్రాజ్ఞుడవై దిరుగుమా
వరకట్నం కొరకు నీవు ఆశించి చదువకూ
దేశసేవ కొరకు నీవు దీక్ష తోడ చదువుమా
ఉద్యోగం రాలేదని ఉన్నదంత అమ్మి తినకు
నడుము కట్టి మడిదున్నుము
మడిని మాత్రమమ్మి తినకు. ॥విద్యా॥

# ధన్యజీవి

ప॥ అన్నా . . ఓ రైతన్నా . .
నీకు ఉన్న కష్టాలకు తోడు ఎవరు లేరన్నా. .
దేశానికి దూలానివి మానవాళి ప్రాణానివి
శ్రమజీవివి నీవన్న ధన్యుండవు నీవన్నా

చ॥ ప్రాణికోటి నెల్లసాకు ప్రాణదాతవు నీవన్నా
జాతి ప్రగతి మూలానివి ఈ జగతికి కళానిధివి
వర్షాలు తక్కువైన పంట మొక్కలెండిపోవు
వర్షాలు ఎక్కువైన పంట చేలు మురిగిపోవు ॥అన్నా॥

చ॥ కాలమయ్యి పంటరాగ ధరలేమో అడుగంటును
ఎరువులను కొనబోతే ధరలేమో మిన్నంటును
ఆడపిల్లలొక వైపున, కొడుకు కోడలొకవైపున
నెత్తిగీకు కుంటవారు క్రొత్త బట్టలడుగుచుంద్రు
కుంటి, గ్రుడ్డి ఒకవైపున కూలివారలొక వైపున
కడుపు గీకు కుంటవారు జోలెగంప పట్టుచుంద్రు ॥అన్నా॥

చ॥ షావుకార్లు ఒకవైపున, అప్పులడుగవచ్చుచుంద్రు
మీసాలను దువ్వుకుంటు గోచీలను చెక్కుకుంటు
వడ్డీ అసలు కొరకు నీవు అడ్డుబెట్టు పొలమందురు
అప్పులోల్ల బాధలకు అణగారి పోతుంటవు
కొంతైన బంధువులు చెంతజేర రారు ఎవరు
సంత ఏమి చేయకుండ చింతజేస్తు కుర్చుంటవు ॥అన్నా॥

చ॥ పంట పొలము మంచెపైన స్వర్గసుఖము పొందుతావు
కంకి కంకి బట్టి జూసి కరువు దీర నవ్వుతావు
అంతకన్న మిన్న సుఖము లేదన్నా నీ కెన్నడు

సహనంబె నీకు తోడు ! శీలంబే నీకు నీడ !
అంబలియే నీకు అమ్మ ! /కంబలియే నీకు తండ్రి !
ఎద్దులూ ఎనుములూ నీ బంధుమిత్రులు
అందరూ నీవారే నీవారు ఎవరు లేరు
మాన్యుడవు నీవన్న ధన్యుడవు నీవన్న
ఇలలోన ఇట్టివారు లేరన్నా ఇంకెవ్వరు.

## ప్రేమ

ప॥ ఆడుతాను అందంగా అందాల రాణిగా !
పాడుతాను మధురంగా మత్తెక్కిన తుమ్మెదలా !
డెందాలను కదలించి నా పదముల పొందింపగ

చ॥ నను వలచిన వారి మనసు సొగసుగా మలచుటకై,
మానవునిగ మసలుటకై తన ధర్మము తెలుపుటకై
సత్య ధర్మ శాంతి ప్రేమ స్వాంతమందు పెంచుటకై
సమాజాన్ని సంస్కరించు సద్గురువుగ మెలగుటకై
॥ఆడు॥

చ॥ పాడుతాను మధురంగా పల్లవి చరణాలతో,
పద పాటవ మతి తేటగ ఎదలోపల మెదలాడగ
మాటలనే పాటగా మలచుకొనియు,
మనసునే వీణగా మార్చుకొనియు
మనసేనల వీనులలో వీరరసము వినిపించియు
శత్రువులను నేలగూల్చు ఉత్సాహము తెప్పించెద
'పరపీడన పాపమ'నే సూక్తులన్ని చుట్టిపెట్టి
'సత్యమేవ జయతే'యని ఆత్మఘోష వినిపించెద
ప్రాణాలను కాపాడే వృక్షాలను పోషింపుచు
తన ధర్మము తెలుపుటకై జాతిసేవ జేయుటకై
నను పిలిచియు గౌరవించు వారి మనసు శాంతి కొరకు
సంసార జీవితాన్ని సంబరముగ గడపుటకై ॥పా॥

చ॥ నను నమ్మిన శిష్యకోటి న్యాయంగా బ్రతుకాలని
తల్లిదండ్రి గురువులను గౌరవంగా చూడాలని
కర్తవ్యం తెలిసికొని కార్యదీక్షబూనాలని
నవ్వుకుంటు నడి రోడ్డున, అర్ధరాత్రి తిరుగుతుంటే
భారతీయ సంస్కృతిని తిరస్కరించి తిరుగుతుంటే
పాఠాలు వినకుండ ప్రక్క దిరిగి చూస్తుంటె
విద్యార్థిగా మెలుగుటకై బుద్ధి కలిగి బ్రతుకుటకై
తిడుతాను తీవ్రంగా ! కొడతాను కోపంగా
ఆడినా. . పాడినా. . తిట్టినా. . కొట్టినా
అందులోనె ఉంటుంది అంతులేని ప్రేమ.

# అబలయే సబల

ప॥ స్త్రీయేరా నీ పాలిటి దైవం. . .
స్త్రీల మనసు తెలిసికొనుటె పురుషుల ధర్మం. . .
పురుషుల ధర్మం . . .

చ॥ స్త్రీయంటే వంటింటి బంటువు కాదు
నీ జంట నుండి ఇంటి నింద వెలుగొందే దివ్యజ్యోతిరా
పుట్టెడు పరివారమిడిచి పుట్టినిల్లు వదిలిపెట్టి !
మెట్టినిల్లు గట్టిజేయ కట్టుబడిన దిట్టరా ! ॥స్త్రీ॥

చ॥ తనువులోని రక్తాన్ని క్షీరంగా మార్చుకొనియు
నీవంశ వృక్షాన్ని క్షీణించి పోకుండగ
పోషింప వచ్చినట్టి పుణ్యమూర్తిరా, ప్రేమమూర్తిరా
మగవారి మానధనం కాపాడదలచియే
కష్టాలను దిగమింగే కాళి మాతరా ॥స్త్రీ॥

చ॥ తన దేహం బిడ్డ కొరకు త్యాగంబు జేసియు
శస్త్ర చికిత్స చేసికొనియు, సంతానం అందించును
పుట్టిచచ్చి చచ్చిపుట్టి నీ మేలే కొరుచుండ
కోమలహృదయాన్ని నీవు కాల్చబోకు మెప్పుడున్
నారీమణి శీలమే నరజాతికి శిరోమణి
ఆడవారి కన్నీరే మగవారికి నరకయాత్ర
కలకాలం నీయాలిని కలిసిమెలిసి బ్రతుకుమా
సంతసమున ఉంచి సతిని స్వర్గసుఖము పొందరా
ఆడదంటే అబలగాదు సబలయనియు తెలుసుకొనుము.
॥స్త్రీ॥

# విజ్ఞప్తి

ప॥ వినరా భారత వీరసోదరా! వీనులార మీరూ!
మహబూబునగరం జిల్లా వాసుల వింత చరితనేడూ
తరిగిట తరిగిట థా!

చ॥ భౌతిక వనరులు బాగుగ లేకను
బలమౌ పొలములు బొత్తిగ లేకను
వట్టిగుట్టలకు మిట్టభూములకు
పుట్టిల్లైపోయెరా! మహబూబునగరం జిల్లా మనది
చదువురాని వారి సంఖ్య పెరుగుటకు కారణమిదియేరా!
॥విన॥

చ॥ పచ్చపచ్చని అడవులులేకను, కర్షకకోటికి వర్షాలులేకను
పాడిపంటలు సరిగాలేకను పశువు ఎరువులు బొత్తిగలేకను
పాడుభూములకు బీడుభూములకు
నిలయం అయిపోయెరా! మహబూబునగరం జిల్లా మనది
చదువురానివారి సంఖ్య పెరుగుటకు కారణమిదియేరా!
కార్మిక కర్షక విజ్ఞానదాతల పుట్టిల్లిదియేరా
మహబూబునగరం జిల్లా మనది - 2 ॥వినరా॥

చ॥ సకాలానికి వర్షాలులేకను, సచ్చిపోవును పైరుమొక్కలు
అకాలానికి వర్షాలు వచ్చియు మురిగి పోవును
పైరుపంటలు

పచ్చికరువులకు వట్టికరువులకు పుట్నిల్లైపోయెరా
మహబూబునగరం జిల్లా మనది -2
చదువురాని వారిసంఖ్య పెరుగుటకు కారణమిదియేరా
॥వినరా॥

చ॥ శ్రీశైలం ప్రాజెక్టు వల్లను, శ్రేష్ఠమైన భూములన్నియు
పసిడిపంటలు పండేభూములు, ఎరువులేకనే
పండేభూములు
పల్లపు ప్రాంతములగుట చేతను, మునిగి పోయెరా
కృష్ణా నదిలో
చక్కటి పంటలు తక్కువాయెరా! కష్టాలెన్నో
ఎక్కువాయెరా!
కరవురక్కసి కోరలక్రిందను, కబళం అయిపోయెరా!
॥వినరా॥

చ॥ కరువుకాలము తాండవింపగా కర్షకులెల్ల వలసబోదురు
పారలు తట్టలు నెత్తినబెట్టుక పట్టణాలకు వెళ్ళిపోదురు
ఆకలిచేతను అల్లాడుకుంటు, గుడిసెలోన బ్రతికేవారికి
పొట్టకూటికి కష్టమాయెరా ! బడికి వెళ్ళుటకు
భారమాయెరా!
చదువురానివారి సంఖ్య పెరుగుటకు కారణమిదియేరా!
॥వినరా॥




# స్వాగతం



ప॥ స్వాగతం పలుకుతుంది అక్షర కిరణం
చదువురాని వారికెల్ల అక్షర కిరణం
అక్షరకిరణం........ రక్షణ కిరణం

చ॥ తక్షణమే రమ్మన్నది అక్షర కిరణం
మీ రక్షణకై పిలూస్తుంది అక్షర కిరణం
గాసాలను తీసుకోదు అక్షర కిరణం
మోసాలను తెలుపుతుంది అక్షర కిరణం ॥స్వాగతం॥

చ॥ జాతిసేవ చేయుటకై అక్షర కిరణం
ప్రేమతోడ పిలూస్తుంది అక్షర కిరణం
నీతులెన్నొ నేర్పుతుంది అక్షర కిరణం
వెతలన్ని బాపుతుంది అక్షర కిరణం ॥స్వాగతం॥

చ॥ సంసార సాగరాన్ని అక్షర కిరణం
సంబరమున దాటించును అక్షర కిరణం
లెక్కలెన్నొ నేర్పించును అక్షర కిరణం
మొక్కులన్ని నెరవేర్చును అక్షర కిరణం ॥స్వాగతం॥

చ॥ చింతలన్ని దీర్చుతుంది అక్షర కిరణం
వింతలెన్నొ జేయించును అక్షర కిరణం
పెత్తనాలు నేర్పుతుంది అక్షర కిరణం
మీ తల్లివలె రక్షించును అక్షర కిరణం. ॥స్వాగతం॥

# ఆలాపన

ప॥ రండిరండి వేగరండి ఈ ఊరిప్రజలందరు
అక్షరాలు నేర్వండి అందరిలో కలువండి

చ॥ రాత్రిపూట బడికిరండి రాయజదువు నేర్చుకొండి
పైసలేమి ఇవ్వకండి పలుకపైన రాయండి
వయసు ఎంత ఉన్న మీకు వస్తుందీ చదవండి
బద్ధకంబు వదలండి శ్రద్ధతోడ చదువండి
హద్దు పద్దు లేనట్టి ఆనందం పొందండి ॥రండి॥

చ॥ పలుకండీ రాయండీ అక్షరాలనూ
అవేమిమ్ము రక్షించును ఎల్లవేళలా
దినమొక్కటి నేర్వండి అక్షరాలనూ
ధనవంతుల జేయుమిమ్ము ధరణిలోపలా
గుర్తుపట్టి రాయండి అక్షరాలనూ
గుణవంతులజేయు మిమ్ము ఎంతోగొప్పగా
దీక్షబూని దిద్దండి అక్షరాలనూ
రక్షించును అవేమిమ్ము అక్షయమ్ముగా ॥రండి॥



# అక్షరాలే నిన్ను రక్షించు

ప॥ మాకు చదువురాదనే చింతజేయవలదు మీరు
నేర్వరానిదేది లేదు చదువులోపలన్ ఈ చదువులోపలన్
చదువంటే చిరుతపులి కానేకాదు
చెంత జేరి చింతదీర్చు చక్కని గురువు

చ॥ హలము బట్టి పొలముదున్ను ఓరైతన్నా!
కలము బట్టి కాగితాన్ని రాయలేవా!
పదునుజూసి.... అదునుజేసి
విత్తులేసి.... నారుపోసి
నీరుకట్టి, ఎరువులేసి
పలురకాల పంటలెన్నో పండించే ఓరైతన్నా...
పలకపై బలపముంచి రాయలేవా?
అక్షరాలు నీనోట పలుకలేవా?.... ॥మాకు॥

చ॥ నెత్తిమీద చుట్టబెట్టి
తట్టనిండ మట్టినింపి
కారుచున్న చెమటనీవు
కొంగుతోటి తుడుచుకుంటు
కాల్వకట్ట లేయబోయె ఓబంగారక్కా !

నీళ్ళుమోసి, అంట్లుదోమి, వంటజేసి
ఇల్లు అలికి ముగ్గులేయు ఓచిట్టిచెల్లీ!
పలకపై బలపముంచి రాయలేవా?
అక్షరాలు నీనోట పలుకలేవా? ॥మాకు॥

చ॥ గడ్డపార కంటె బరువు బలపము లేదు
సలికెపారకంటె బరువు పలక లేదు
ముగ్గుకంటె కఠినముగా అక్షరాలు లేవు. . .
చేనులో నీ పాట కంటె పాఠాలె అతిసులువు
రాత్రిబడికి వెళ్ళి మీరు రాయజదువ నేర్చుకోండి
రాయజదువ నేర్చుకొని రాజువలె దిరుగండి ॥మాకు॥

చ॥ అలనాడు పోతన రైతే అయినా!
చదువునేర్చి భాగవత గ్రంథంబు రాయలేదా!
చినయసూరి చిన్నప్పుడు చదువనెలేదు
పెద్దగయి చదువు నేర్చి బాలవ్యాకరణ గ్రంథంబు
రాయలేదా!

విశ్వకవి రవీంద్రుడు ఇంట్లోజదివి
గీతాంజలి గ్రంథంబు రాయలేదా
మొద్దబ్బాయ్ వరదరాజు శ్రద్ధతోడ చదువుకొని
లఘు సిద్ధాంత కౌముదిని రాయలేద
తినడానికి తిండిలేక క్రొత్తబట్ట కొనలేక
పాతబట్ట కట్టుకొని పగలెల్ల పసులగాసి
రాత్రిపూట చదునేర్చే వీధిలైట్ల వెలుతురులో

నిరుపేద అబ్రహాంలింకన్. . .
అమెరికాకు అధ్యక్షుడు కాలేదా? ॥మాకు॥

చ॥ రాయజదువ నేర్చుకుంటే మీ బ్రతుకే మారవచ్చు
పత్రాలు రాయవచ్చు, ఉత్తరాలు జదువవచ్చు
సౌధలెక్క తెలిసికొని బాకీలను దిద్దవచ్చు
బంధువులను జాడ మీరు బస్సులెక్కి వెళ్ళవచ్చు
ఉత్తరాలు వస్తె మీకు బడిలోన పెట్టుకొని
వెర్రి వారివలె మీరు ఎన్నాళ్లని తిరుగుతారు ॥మాకు॥

## బొడ్డెమ్మపాట

ప॥ అక్షరాలు రాక ఉయ్యాలో అల్లాడు వారికి ఉయ్యాలో
వలలోని పక్షివలె ఉయ్యాలో తండ్లాడు వారికి ఉయ్యాలో
అక్షరకిరణం వచ్చి ఉయ్యాలో మోక్షాన్ని కలిగించె ఉయ్యాలో
చదువురాదని మీరు ఉయ్యాలో చింతజేయవలదు ఉయ్యాలో

చ॥ అ,ఆలు ఇ,ఈలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
ఉ,ఊలు ఋ,ౠలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
ఏ,ఐలు ఓ,ఔలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
క,ఖ,గ,ఘ,ఙ లు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో

చ,ఛ,జ,ఝ,ఞలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
ట,ఠ,డ,ఢ,ణలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో

చ॥ త,థ,ద,ధ,నలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
ప,ఫ,బ,భ,మలు ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
య,ర,ల,వ లన్నిటిని ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో
శ,ష,స,హ లన్నిటిని ఉయ్యాలో ఒకరోజు నేర్వచ్చు ఉయ్యాలో ॥అక్షరాలు॥

చ॥ మూడురోజులలోన ఉయ్యాలో అచ్చులను నేర్వచ్చు ఉయ్యాలో
ఏడురోజులలోన ఉయ్యాలో హల్లులను నేర్వచ్చు ఉయ్యాలో
పదిరోజులలోన ఉయ్యాలో పదములను నేర్వచ్చు ఉయ్యాలో
పండ్రెండు రోజులకు ఉయ్యాలో పాఠాలు నేర్వచ్చు ఉయ్యాలో
పదమూడు రోజులకు ఉయ్యాలో పద్యాలు నేర్వచ్చు ఉయ్యాలో
పద్నాల్గు రోజులకు ఉయ్యాలో పత్రాలు జదువచ్చు ఉయ్యాలో
పదహైదురోజులకు ఉయ్యాలో పండితులు కావచ్చు ఉయ్యాలో
నామాట నమ్మండి ఉయ్యాలో నల్గురిలో కలవండి ఉయ్యాలో
ఈ పాట మనసార ఉయ్యాలో పాడిన విన్నను ఉయ్యాలో
నిరక్షరాస్యులు ఉయ్యాలో అక్షరాస్యులౌతారు ఉయ్యాలో



# కోలాటం పాట



(అక్షరాస్యుడు:- "అక్కా! ఓ రాములమ్మక్కా!

నిరక్షరాస్యురాలు:- ఏంది తమ్ముడూ ! ఏం పని వడిందబ్బా ఎనిమిది గొట్టె రాత్రిల్ల వస్తివెందుకో?

అక్ష:- ఏండ్లేదక్కా నేను చదువురాని వారికి చదువు నేర్పుతుండ నీవుగూడ వచ్చి చదువుకోమరి.

నిరక్ష:- నాకెప్పుడూ తీరిక వుండదు తమ్ముడూ చదువు నేర్చుకోనీకె.

ఎప్పుడూ పనే ఉంటుంది పనిసల్లగుండ.

అక్ష:- అట్లనా

నిర:- అవును తమ్ముడూ!

అక్ష:- అట్లైతే నేనొక ఉపాయం జెప్తఇంటవామరి

నిర:- ఇంట తమ్ముడూ ఎందుకిననూ?)

అక్ష:- అంట్లుదోముకుంట నీవు అ,ఆలు నేర్వక్క
ఇల్లు ఊడ్చుకుంట నీవు ఇ,ఈలు నేర్వక్క
పొయ్యి ఊదుకుంట నీవు ఉ,ఊలు నేర్వక్క
రొట్టె గొట్టుకుంట నీవు ఋ,ౠలు నేర్వక్క

2) ఎద్దులమేపుకుంట నీవు ఎ,ఏ,ఐ నేర్వక్క
ఒడ్డుమీద గడ్డిగోస్తు ఒ,ఓ,ఔ నేర్వక్క
అంబలిగల్పుకుంట నీవు అం,అః నేర్వక్క
కలుపుదీసుకుంట నీవు క,ఖ,గ,ఘ నేర్వక్క

3) చాప జుట్టుకుంట నీవు చ,ఛ,జ,ఝ నేర్వక్క
టీ,కాఫీ దాగినపుడు ట,ఠ,డ,ఢ నేర్వక్క
తల్లెగడుగుకుంట నీవు త,థ,ద,ధ నేర్వక్క
పప్పురుబ్బుకుంట నీవు ప,ఫ,బ,భ నేర్వక్క

4) ఏమిదోయనపుడు నీవు య,ర,ల,వ నేర్వక్క
శేరు వట్టి కొల్చినపుడు శ,ష,స,హ నేర్వక్క
ఙ,ఞ,ణ,న,మ, ఎప్పుడన్న నేర్వక్క
గుణింతం వత్తులన్ని గుర్తుపడ్తె సాలక్క

5) గొప్ప గొప్ప పుస్తకాలు గంటలోన జదువతవక్క
రాత్రి బడికి వచ్చి నీవు రాయ జదువ నేర్వక్క
ఇంటిలోన చేనులోన ఇడువకుండ జదువక్క
ఇడువకుండ జదువుకుంటె ఇల్లుబాగపడ్తదక్క

6) ఇల్లు బాగపడ్తెనీది గేరి బాగపడ్తదక్క
గేరిబాగపడ్తెనీది ఊరు బాగపడ్తదక్క
అక్కరోమాయక్క నామాట వినుమక్క
నామాట వినుమక్క నాబడికి రా అక్క

7) అట్లైతె తమ్ముడూ ఇప్పుడే వస్తపారా
ఇప్పుడే వచ్చి నేను రాయజదువనేర్చుకుంట
రాయజదువ నేర్చినేను లెక్కలన్ని నేర్చుకుంట
లెక్కలన్ని నేర్చినేను చక్కగా జీవిస్త.





## ప్రార్థన

అతి సంతోషం
అతి సంతాపం
మతి భ్రష్టత్వానికి మూలం
ఆగ్రహముగాని అనుగ్రహముగాని
అధికంగా యున్నప్పుడే
మనిషి మానవత్వాన్ని కోల్పోతాడు
అందుకే నాలో పెంచు
"నిగ్రహశక్తి"
త్రుంచకు స్వామీ నీ పైభక్తి.

## అమరత్వం

మీరు మీ జీవితంలో
అనుభవించలేరు ఆనందం ఆరోగ్యం
సంయోగాలు చావనివ్వవు
వియోగాలు బ్రతుకనివ్వవు
దైవయోగంలో ఉంటుంది ఆనందం
జాతి సేవలో పెరుగుతుంది ఆరోగ్యం
మీ శరీరాలు వదలిన

# అదే నా ధర్మము

నాకు చావు లేదు, పుట్టుక లేదు
నా రూపం అనిర్వచనీయం
మీకు కనిపించే ఈ శరీరం క్షరం
నా చరిత్రయే అక్షరం
నా పోషకులు పంచ భూతాలు
నా కులం మానవ కులం
నా దేశం భారతదేశం
నా మతం సర్వజన సమ్మతం
నా దేశానికి నా జాతికి ఏ మాత్రము హాని కల్గినా
సహించను, సదా రక్షిస్తాను
సంఘటితంగా ఉద్యమిస్తాను
అదే నా ధర్మం.

# సందేశము

పండుగ ఉగాదిమనకిట
దండిగ పచ్చడిని దాపి ధన్యులజేసెన్
మెండుగ వ్యాధులు బాధలు
ఉండవు ఈనాటినుండి ఒక్కరికైనన్

తీపి చేదు పుల్పువగరు తేటగాను
కారముప్పును కొంచెము కలిపితిన్న
సర్వరోగాలు నశియించి సహనమబ్బు
బుద్ధిమంతులు చెప్పిన ముద్దుమాట.

# అందుకే వచ్చింది స్వాతంత్ర్యం

స్వాతంత్ర్యం వచ్చింది ఎందుకో తెలుసా?
సమాజంలో సదాచారత పెంచడానికి
సత్సాహిత్యాలను చదువడానికి
తన అంతరంగంలో సద్భావనలు పెంచడానికి
నిత్యకృత్యాలను సత్యమార్గంబులో నడపడానికి
సహనంతో సత్కార్యాలు సాధించడానికి
ఇతరులను గౌరవంగా చూడటానికి
తన జీవన యాత్రను సౌమ్యంగా నడుపుకోవడానికి
దేశ శ్రేయస్సుకై పాటు పడడానికి
అందుకే వచ్చిందీ స్వాతంత్ర్యం.

# ప్రసాదం

ఆరోగ్యకరమైన ఆహారం – ఆరగిస్తూ ఉంటేనే మనం
అనుభవిస్తాము ఆనందం – అందంగా వుంటుందీ దేహం
మానవతను పెంచే సాహిత్యం
చదివిస్తూ ఉంటేనే ప్రభుత్వం
హాయిగా జీవిస్తుందీ సమాజం
ప్రగతిలో ముందుంటుందీ దేశం
దేనిని వ్యతిరేకించిన మనం – నాశనమౌతుంది సర్వం
ఆహారం చదువు సంస్కారం – మానవాళికి మహాప్రసాదం

# మరచిపోతున్నాం

స్వాతంత్ర్యం వచ్చిందనుకున్నాం,
సంబరాలేవో చేసికొనుచున్నాం.
ప్రభాత భేరీలు మ్రోగిస్తున్నాం,
పాటలు ఎన్నో పాడుకుంటున్నాం.
నీతులు ఎన్నో చెప్పుకొంటున్నాం,
స్వీటు కారాలు తిని వేస్తున్నాం.
స్వతంత్ర హక్కును చాటుతున్నాం,
ప్రతిజ్ఞ లెన్నో చేస్తున్నాం.
కాని అన్న మాటలాచరించ లేక పోతున్నాం.
పరపీడన మహాపాపమంటున్నాం
పామరులనే పీడస్తున్నాం.
మద్యపానం చేయరాదంటున్నాం,
అది లేక పోతే నిదుర రాదంటున్నాం.
వరకట్నం రూపు మాపాలంటున్నాం,
అది ఇవ్వక పోతే పెండ్లి జరుగదంటున్నాం,
స్వాతంత్ర్యం వచ్చిన రోజే ప్రతిజ్ఞలు చేస్తున్నాం
మరుసటి క్షణమే మరచిపోతున్నాం.

## ఆకాంక్ష

మన సత్సంకల్పమే ఒక కల్పతరువు
ధృఢమైన విశ్వాసమే ఒక కామ ధేనువు
ఈ రెండూ నీలో నివసించినపుడే
దైవం నీకు తోడుగా ఉంటాడు - నీ కష్టాలన్నీ కడతేరుస్తాడు
నీకెదురయ్యే కష్ట సుఖాలు - ఇష్ట దైవానికే అర్పించు
అన్నిటికీ సంతసించు - ఆనందం అనుభవించు
ఆత్మ వంచకుడవు కాబోకు - హాయిగా జీవించు
అదే నా ఆకాంక్ష !

## జాగ్రత్త

మనిషికి
షడ్రుచులలో ఏ రుచి ఎక్కువైన తక్కువైన
ఏదో ఒక రోగం రాక తప్పదు
మతి ఎక్కువైన తక్కువైన కోతి మతి రాక తప్పదు
ధనం ఎక్కువైన తక్కువైన ఏదో ఒక ఆందోళన తప్పదు
పార్టీలలో మెజార్టీ ఎక్కువైన తక్కువైన
దేశానికి దుస్థితి తప్పదు
అజ్ఞాని వల్ల విశేషజ్ఞాని వల్ల సమాజానికి సంతాపము తప్పదు
అందుకే జ్ఞానులంత ఏకం కావాలి సమాజానికి సందేశాలివ్వాలి
అతి తక్కువ అతి ఎక్కువ ఏదైనా
ఎక్కడా. .ఎప్పుడూ. .పనికిరాదు
మితము అతి హాయి అమితము అతి హాని - అని !

# నీవే మేలు

వాగ్దానాలతో ముగ్గుల జేసి
రాజుగా గద్దెపై విరాజిల్లి
ప్రజలను పరాభవించడమే,
ఈనాటి మేటి రాజుల కర్తవ్యం
పామరుల మొరలు చెవికి వినిపించవు
ప్రార్థనాపత్రాలలోని పండితుల పదాలు,
కంటికి కనిపించవు
కోర్టు తీర్పులను పార్టీబలంతో,
నల్లులవలె నల్చివేస్తారు
అందుకే నేనంటున్నాను. . . .
కొండమీది ఓ బండరాయీ నిన్ను
తొలసి నిలిపినా దైవంగా మారుతావు
మలిచి కట్టినా మందిరమై పోతావు
అరుగుమీద పరచినా పాన్పుగా పడిపోతావు
నీ ముక్కలు మురికి దారిలో వేసినా
మోటారు కారులు నడిపిస్తావు
నీ మసిలో నీరు, ఇసుక పోసిన, అందమైన బొమ్మవై
అందరినీ మురిపిస్తావు,
నేటి మేటి రాజుగుండె కంటె
కొండమీది ఓ బండరాయి నీవే మేలు

# పదండి ముందుకు

భారతీయసోదరీ! భరతమాత పుత్రికా!
జాతి సేవజేయనీకు, జంకుఏల సోదరీ!
జన్మభూమినుద్ధరింప ధరణియందు నిల్చినావు
కన్నతల్లి దుర్గతులను అణగద్రొక్కుమన్యాయము
మాతృభూమి కీర్తికొరకు మహిలోనవెలసినావు
అబలనంచు అదురవద్దు సబలవైసాగుముందుకు
వరకట్న పిశాచాల వలలోనపడకుండ
ఆదిశక్తి రూపమెత్తి హతమార్చుము అక్రమాలు
అర్ధనగ్నవేషాలే ఆడవాళ్ళ యమదూతలు
ఒళ్ళునిండ వస్త్రాలు మహిళామణి శివదూతలు
తోడు ఎవరు లేకుండ ఒంటరిగా వెళ్ళవద్దు
పురుషుడొక్కడున్నచోట పూర్తిగాను ఉండవద్దు
ఉద్యోగము చేయుచు ఉనికిని కాపాడుకొనుచు
సమాజాన్ని చక్కదిద్ద సాగింపుము నీయాత్రను
నీ చరిత్రయెనీకు కత్తి నీశీలమె నీకుశక్తి
భారతీయ సంస్కృతియే ప్రతివారికి పరమాత్మ
నీ బాధ్యత తెలిసికొనిన నిజదేవతవు నీవమ్మా !

# కానేకాదు కల్ల

ప్రకృతిని పరిరక్షించేది రవి
సమాజాన్ని సంస్కరించేది కవి
వాతావరణ కాలుష్యాన్ని కాల్చివేసేది రవి
సమాజంలో సమస్యలను తీర్చిదిద్దేది కవి
ప్రకృతికి అనుకూలంగా మారుతుంది
రవికిరణములోని వెచ్చదనము
సమాజానికి అనుకూలంగా మారుతుంది
కవి కవనములోని చురుకుదనము
రవి కిరణం కవికవనం మానవాళికి మూలధనం
కవికలము కదలిన పెదవులు మెదలిన
చదువరుల ఎదల్లో వినేవారి వీనుల్లో
కవి పదధ్వని చిందులు త్రొక్కుచూ
విందులు చేయుచూ విలయ తాండవం
ఆడినపుడే
మనసులోని మలినాలు నలిగిపోయి
మనిషిలోని మానవత్వం వెలికి వస్తుంది
తలచుకుంటే సత్కవి
సాధ్యము కానిది లేదీభువి.



# అభిలాష

వేదిక ఇది సాహిత్యవేదిక
సాహిత్యానికే వేదిక సజ్జనులగావించువేదిక
సరస హృదయాలకు సద్గుణ సంపన్నులకు
సచ్ఛీల సుశోభితులకు సమాజశ్రేయోభిలాషులకు
ఈవేదిక ద్వారా వెలువడుతుంది
సాహిత్య దుందుభి, 'దుందుభి'యై
సమాజాన్ని సచేతనుల చే
వీనుల విందుగ నేత్రపర్వముగ
మనోహ్లాదముగ సకలజనామోదముగ
సన్నగ చిన్నగ సాగుతుంది ముందుకు
సరసభరితయై సామియై సద్భావసంధియై సాధ్వియై
సమాజచేతనియై సారథియై
సారస్వత స్రవంతియై సంజీవియై
చిరంజీవియై శ్రీమంతయై సమాజాన్ని సంస్కరిస్తూ
సాగాలి ముందుకు మునుముందుకు
అని ప్రార్థిస్తున్నా పరమేశ్వరుని
నా ఆశయాలు సమాజ సంస్కారసాధనాలై
తోడ్పడునవిగా రాజిల్లి సాహిత్యదుందుభిలో
నాకలము ద్వారా జాలువారాలని
నేను కాంక్షిస్తున్నా

('సాహిత్య దుందుభి' మాసపత్రికలో జనవరి, 1985లో ప్రచురణ)

## మినీ కవిత సూక్ష్మ రూపం (పరమాత్మ)

| | | | | |
|---|---|---|---|---|
| మి | = | మిక్కిలి | – | అహంకారం |
| నీ | = | నీతి | – | బుద్ధి |
| క | = | కవిత | – | మనస్సు |
| వి | = | విశిష్ఠ | – | జ్ఞానం |
| త | = | తరంగాలు | – | చిత్తం |

## మినీ కవిత సామాన్య రూపం (ఆత్మ)

| | | | | |
|---|---|---|---|---|
| మి | = | మిక్కిలి ప్రధానమైన | – | కన్నులు |
| నీ | = | నీతి సహిత | – | ముక్కు |
| క | = | కవితల | – | నాలుక |
| వి | = | విజ్ఞాపన | – | చర్మం |
| త | = | తత్వాలు | – | చెవులు |

## మినీ కవిత స్వరూపము (అనాత్మ)

| | | | | |
|---|---|---|---|---|
| మి | = | మిక్కిలి ప్రధానమైన మేలిమి | – | కాళ్లు |
| నీ | = | నీతి ప్రధాత, మీ దుఃఖనాశినీ | – | చేతులు |
| క | = | కరుణాంత రంగిక | – | నాలుక |
| వి | = | వినూతన భావి | – | గుహ్యము |
| త | = | తరాల సుఖదాత | – | పాయువు |

# మనవి

మితాహారమే మిక్కిలి బలిమి
నీరే నిర్మల సౌఖ్యదాయినీ
కర్మే ఫలితము నిచ్చును చెప్పక
వినయము విలువల పెంచును నీవి
తన మనసే అన్నిటికి నేత.

# సందేశము

మినీ కవిత చెలిమి
నీలో కల్మష నాశినీ
కల్ల కాదు ఈ మాటిక
వినిపించుకో నీ చెవి
తప్పించుకోగలవు బ్రహ్మరాసిన చెడురాత.

# సలహా

మిక్కిలి సువిశాలమైనదీ భూమి
నీవు జీవిస్తున్న ఈ ప్రపంచంలో, మెనీ
కరువుకాటకాలు ఎన్ని వచ్చిన జంకక
వినయ విధేయతలతో మెలగుతు భువి
తన జీవనం గడుపమంటుందీ కవిత.

# హెచ్చరిక

మిడిమిడి జ్ఞానుల చెలిమి
నీ ఒడిలో నిప్పుల కొలిమి మెనీ
కలిమి కాశించేకవుల కవనము, ఇక
విశ్వాన్ని పతనము చేస్తుంది, నీవే ఇవి
తర్కించి దేశ శాంతికి పాటుపడుకొంత.

# ఉత్సాహం

మిగిలిన జీవితము పుడమి
నీదే స్వంతం మదిలో నీ
కలతలు పెంచుకొనక
విధి నెదిరించు శక్తులు పెంచుకో అవి
తనలో ఉన్నవంటుంది నీ చరిత.

# కర్తవ్యం

మిత్రమా నీవారిపై పెంచుకోవద్దు కూరిమి
నీవు వైరము పెంచుకోవద్దు ఇతరులపై నీ
కన్నతల్లితో తగవులాడవద్దు తరచుగా, ఇక
వింటున్నావుగా మాటలు నావి
తన కర్తవ్యమెరిగి తిరిగుము ఓ భారతనేత.

# ఆనందం

మిడిసి పడకు మిత్రమా అందరూ నీ వారె
నీ ఆత్మనడుగు తెలుస్తుందీరోజే
కలవరపడకు వేరే
విశ్వమే నీదనుకుంటే
తనకు శత్రువే లేడంటుందీ మినీ కవిత.

# జాగృతి

భారతమాతకున్ బాధలురాకుండ
కరుణతో త్యాగివై కదలవలయు
దారుణకార్యాలు దండిధైర్యంబుతో
ఎదిరించి దేశంబు నేలవలయు
మాతృభక్తిని జూపి మహనీయగుణముచే
త్రికరణ శుద్ధిచే తిరుగవలయు
అఖిలజగము నీకు హారతులెత్తగ
ఘనకీర్తి సంపదల్ గాంచవలయు
అల్పబుద్ధిలేని ఆరాధ్య భటులకు
కల్గుశోకమెల్ల కాలరాచి
భావి జనుల మేలు బంగారు భూమిపై
బ్రతుకు వాడవీవె భారతీయ

('సాహిత్య దుందుభి' మాసపత్రికలో జూన్ 1982 లో ప్రచురణ)

# జనవరి 26

భారతమాతకున్ మనము భారము బాపుట ధర్మమంచు, ఏ
మారక దీక్షబూను దినమయ్యె ప్రతిజ్ఞలు జేయుచందరున్
భీరము బాసియున్ మదిని భీకర భేదము లీడి మానవుల్
ధీరతబుద్ధులై మెలగు దివ్యదినోత్సవ మిప్పుడందరున్
భారతదేశమంతటను, భాగ్యము పండిన రోజుగాన
ఎవ్వారలు మర్వకుండ నతివైభవ శోభల తోడ వేడుకల్
భారిగ జేసికొందురిట భవ్యదినోత్సవ జన్వరీరవై
ఆరవ తేదినాడు మనసార పతాకపు ఛాయలందునన్

పండుగలెన్నియో మనకు ప్రాజ్ఞులు చెప్పిరి కాని ఈవిధిన్
మెండుగ నందరున్ గలిసి మిద్దెలనెక్కియు వాడ వాడలన్
దండి పతాకముల్ ఎగుర, ధైర్యము చాటుచు భారతీయులున్
కండబలంబు గుండె బల క్రాంతుల జిమ్మెడు పండుగియ్యదే
లేదని చెప్పవచ్చునిల లేదిక ఇంతటి గొప్ప పండుగే
మాదియె మీదిగాదనియు, మాంద్యులు సైతము పల్కనేర్తురే
వాదన జేయనేల నిట భారతదేశము నంతటన్ ఒకే
తేది ఒకే క్షణం ప్రజలు తియ్యతలంపుల తేలియాడెడున్



# హితవు

గీ॥ భూతదయకును సమమైన పుణ్యఫలము
ప్రాణిపీడన సమమైన పాతకంబు
లేదులేదంచుదెల్పిరి వేదవిదులు
మానవత్వంబు గల్గిన మానవులకు

గీ॥ మనసుచే కర్మచే వాక్కు మహిమచేత
సర్వజీవుల సంతాప సమయమందు
సానుభూతిని జూపియు సాకవలయు
లేకయుండిన దానవ లీలయగును

సీ॥ యాత్రలు దిరిగియు యాగంబుజేసియు
శాస్త్రాలు జదివియు సర్వమెరిగి
దానముల్ జేసియు ధర్మశాలలుగట్టి
తీర్థములమునిగి తేలియాడి
సత్యంబు పలికియు సంగీత మబ్బియు
సాధువేశాలచే సంచరించి
జపముజేయ కురులు జడలుగట్టినగాని
ఫలితంబు దక్కక పతనమగును
భక్ష్యనైవేద్యములు బెట్టి భక్తితోడ

మూర్తి పూజలు జేయగ ముక్తిలేదు
హీనమతులయ్యి జీవుల హింసజేయ
లేశమైనను లాభంబులేదు నిజము
చెప్పుచున్నాడు బిచ్చయ్య చిన్నిమాట
('సాహిత్య దుందుభి' మాసపత్రికలో మే 1982లో ప్రచురణ)

# సంక్రాంతి

కలియుగమందున కాలచక్రమునందు
క్రాంతులు బహుకోట్లు కదలిపోయె
మానవకోటిలో మానవత్వంబులు
మౌనవ్రతమునందు మ్రగ్గుచుండె
మానవ ధర్మంబు మస్తిష్కమందున
జనియింపకుండుట జాతికర్మ
ఏక్రాంతి వచ్చిన ఈనాటి ప్రజలలో
మనసులో రావాలి మహిమ క్రాంతి
మనిషిమదిలోన మహిమయే మాయమయ్యె
భారతీయుల బ్రతుకులు బ్రతుకులగునె
దానవేంద్రుల బుద్ధిపై దాడిసల్పి
మానవేంద్రుల మహిమపై మఖులుగొన్న
అదియె సంక్రాంతి మనకెల్ల అక్షయముగ
('స్ఫూర్తి' మాసపత్రికలో జనవరి 1988 లో ప్రచురణ)

# విలేకరులకు శుభాకాంక్షలు

ఆధారంబునులేని వార్తలను వ్రాయన్బూనకన్మీరుమీ
మేధాశక్తిని దేశశాంతి కొరకై మేలైన సంవాదముల్
బోధింపన్దగుయత్నమెంతయిన చేబూనీసమాజంబుకే
బాధాంబోధిని ముంచకుండ బ్రతుకన్ భారంబు తగ్గింపుడీ

చేతనులై మెలంగుచు సచేతనవంతులజేయు వారలన్
లేతగరాసిబంపెడి విలేకరకోటికి నా శుభాకాంక్షలున్
జాతిని నీతిచే నడప జాగృతి జేయుడి భారతావనిన్
నూతనవత్సరం ఘన వినూతన కానుక స్వీకరింపుడీ !

# యద్భావం తద్భవతి

ఆ.వె॥ భావశుద్ధిలేని పరిశుభ్రమెంతున్న
వానికంటె పాపి వసుధలేదు
స్త్రీల రూపు చూసి చిత్తంబు చెడకున్న
పుణ్యపురుషుడతడె పుడమియందు

ఆ.వె॥ మ్రొక్కకున్న చాలు మోసంబుచేసెడి
మనసులేకయున్న మాన్యుడతడె
దుష్టబుద్ధిలోన దొడ్డ నడతపైన
ఉండి ఫలములేదు ఉర్వియందు

అనిత్యమౌ ఈ మానవదేహము
నిత్యమౌ నిర్ణయాల సాధనము
మానవజాతి మనుగడ కోసము
దైవంబిచ్చిన మహాప్రసాదము
సత్యము సంస్కృతికి చక్కని సదనము
నిరర్థకమౌ కర్మల కోసము
వ్యర్థము చేయకు జీవితము
అందించుము అందరికి సత్ఫలితము
నీవెవరవో నీవే తెలిసికొనుము
ఆనందించుము సదా జీవితకాలము

('నవభారతి' మాసపత్రికలో నవంబర్ 1999లో ప్రచురణ)

# కవి పలుకులు

సీ॥ నా తల్లి శారద నా తండ్రి పరమేష్ఠి
పంచభూతంబులే ప్రభువునాకు
సజ్జన దుర్జన సహవాస ఫలితంబె
సద్గురువై నాకు చదువు నేర్పు
ప్రకృతిలోనున్న ప్రతిప్రాణి నన్నిల
పరమేశు రూపాన పలుకరించు
ప్రత్యక్ష ప్రజలచే పాఠాలు నేర్చియు
భావి పౌరులమేలు పలుకుచుందు

గీ॥ నాకు చావు పుట్టుక లేదు నైతికముగ
దేహమున్నంత కాలమీ దేశమందు
ఈశ్వరాజ్ఞను పాలించి ఇచటనేను
ఆత్మశాంతిని పొందెద హాయిగాను

సీ॥ శ్రీవినో బాబావె చిత్తశుద్ధిని జేయ
జాతిపితా గాంధి చదువు నేర్పె
శ్రీ కబీరు కవిత శ్రేయోభిలాషియై
నావెంట దిరుగాడి నడుపుచుండ
శ్రీ సూరదాసుచే శ్రీమతి మీరచే
దేవదేవుని లీల దెలిసికొంటి
మళయాలు సద్గురు మర్మంబు దెలుపగా
మాయవీడె యిపుడు మనసునందు

గీ॥ సత్యసాయి రచనలచే సారమెరిగి
తిరుగుచుంటిని నేనొక ధీరమతిగ
ఇందరందున వెలసియు ఇన్నినాళ్లు
జ్ఞానభిక్షను పెట్టియు సాకినట్టి
యాదగిరి వాసుడే నాకు ఆది గురువు

ఆ.వె. జాలిగుండె నాది జంకేమి లేకుండ
పాట పాడుచుండు తేటగాను
తప్పులెన్నియున్న తప్పక దెల్పండి
నేర్చుకొనెద నేను నిజములన్ని

కII నా కలము గీయునెప్పుడు
ఆకలిగొన్నట్టి వారి అలసట దీర్చన్
చీకటి పొలమున బలమౌ
నూకలు పండించు హలము నొక్కియు చెప్పన్

ఉII మ్రొక్కెద మాతృమూర్తికిని మ్రొక్కెద సద్గురు
విఘ్నరాయునిన్
మ్రొక్కెద పెద్దలందరికి మ్రొక్కద సత్కవిరాజ శ్రేణికిన్
మ్రొక్కద పూజ్యులందరికి మ్రొక్కద మౌనుల
పాదపద్మముల్
మ్రొక్కెద లోక మాన్యులకు మ్రొక్కద స్నేహముగోరు
సఖ్యులన్
మ్రొక్కెద వార్తవాహకుల మ్రొక్కెద ఈశ్వర తత్వవేత్తలన్

కII పద్యము గద్యము గేయము
అధ్యయనము చేయుటకును అనుకూలంబౌ
విద్య అవి చదువు మేలగు
మద్యము గాదది మరువగ మానవు లెపుడున్

కII చదువు చదువుచుండ దెలియు
చదువులలోనుండు శక్తి చాలనక సదా
చదువుచునే యుండు మెపుడు
పదవి పదముపెరుగు పరులు పరవశమొందన్

ఆ.వె. కులము మతము భాష విలువల పెంచవు
పండితులయికూడ ఫలము లేదు
పరుల మేలు కొరకు పాటు పడినచాలు
ఆత్మశాంతి కలుగు అక్షయముగ

గీ॥ అచ్చు వేయించి పుస్తకం అమ్ముకొనియు
ధనము నార్జింప మనసులో దలపలేదు
మానవాళి మేలు కొరకు మమత తోడ
వ్రాయుచుందును వాగ్దేవి వరము వలన
నిండుమనసున చదువండి నెనరు తోడ
తగిన సలహాల నివ్వండి తాతలార

ఉ॥ పండితులైనవారు పరిపక్వ మనస్సున ఎల్లవేళల
న్నుండియు మంచి కార్యములు
నొక్కటి చేసిన చాలు జన్మలో
కండలనిచ్చె దేవుడు సకాలమునందు సుకర్మచేయగన్
దండిగ డబ్బు పెంచినను
దండుగకే సరిపోవు ఎప్పుడున్

గీ॥ నాస్తికత్వము పరధనాసక్తి యున్న
ఒకరిమేలును జూచియు ఓర్వకున్న
మనసు సంబంధ పాపాలు మౌనికైన
పరుష వచనాల పరనింద పలుకు లెల్ల

చెడ్డమాటలసత్యంబు చెప్పుటెల్ల
వాక్కు సంబంధ పాపాలు నిక్కముగను
అన్యకాంతల మైధునంబనుభవింప
ఆత్మబోధను వినకుండ అడుగు వేయ
పరులసొమ్ముకై ఆశచే పరుగులిడిన
దేహ సంబంధ పాపాలు తెలిసికొనుము
పదియు పాపాలు బయటకు పారద్రోల
ధ్యాన మబ్బును మనిషికి దండిగాను

ధర్మము వీడక నడచిన
ధర్మమె కాపాడు నిన్ను ధరలో యెపుడున్
ధర్మంబౌ కర్మలచే
ధర్మము కాపాడు నీవు దాంతము తోడన్

వేదోక్తులు బహు బాధౌ
వాదాలకు తావులేక వాస్తవికముగా
భేదాలను ఛేదించుచు
మేధావుల జేయు జనుల మేలుగ జేయున్

వేదము వేదాంగ చరిత
వేదాంతులకే దెలియును విభవము తోడన్
వేదము దెలియదు ఎవరికి
వేదము సాధకుల నెపుడు విడువక బ్రోచున్

భూమిలోన పుట్టి భూమిలో జేరును
పుడమి నేదియైన పూర్తి గాను
వాటికొరకు మనము వాదులాడగ నేల
మానవత్వమెపుడు మనకు తోడు



## సఖుడా!

1) నారి తెగిన నారి తెగిన
మారి యగునుగాన నీవు మతితోమెలగి !
దారకు దగినట్లు దిరుగు
చేరకు మన్యుల సరసకు చెడెదవు సఖుడా !

2) వరదక్షిణలడుగ వలదు
నరజాతికి నలుపువచ్చు నలుగురి లోనన్
పరులను పీడింపవలదు
దరిజేరెడి దార ధనము దండుగ సఖుడా !

3) ఘోరిచరణ సన్నిధి తనదు
కరకమలము లదిమిపట్టు కాంతనువీడీ!
పరకాంత పొందుకొరకు
పరమేశ్వరు దృష్టిలోన పాపము సఖుడా!

4) పుట్టించిన బ్రహ్మమనకు
గిట్టని పరమాత్మనిచ్చి గేహిని యిచ్చెన్
గిట్టని దిట్టవునీవే
వట్టివలపుల వలలోన బడకుము సఖుడా!

5) మగతనమనగా సతిపై
ఎగబారుటకాదు పతికి ఏనాడైనన్
ఎగతాళిజేయకెప్పుడు
నగుమోమున కాపురంబు నడపుము సఖుడా!

6) తెల్లని సతికై వెదకకు
నల్లని మనసున్న నిన్ను నచ్చదు ఎపుడున్
చెల్లదు నీమాటెచ్చట
చిల్లులు పడిపోయి మనసు చెడెదవు సఖుడా!

7) నల్లని సతియని అలుగక
చల్లని మనసుంటెచాలు సంసారంబున్
గుల్లగచేయక మగనిని
అల్లరిబెట్టని మగువయె ఆడది సఖుడా!

8) నలుపకు నారిని ఎప్పుడు
పిలిచిన అలుగక పలుకుచు ప్రేయసి తోడన్
కలియుము కలవర పడకన్
నలుపుగ నీ భార్యయున్న నవ్వుచు సఖుడా !

9) నీ భార్య మనసు దెలిసిన
ఏభారము నుండబోదు ఇలపై నీకున్
నీ బాధ్యత దెలిసికొనిన
నీ భార్యయెనిన్ను గొలుచు నిజముగ సఖుడా !

10) తక్కువ ప్రేమను జూపిన
పక్కన పగిలొక్కలౌను పళ్ళెము చెంబుల్
ఎక్కువ ప్రేమను జూపిన
ఎక్కును నీవీపు మీద ఎరుగుము సఖుడా !

11) ఎట్టిగ జూడకు భార్యను
పట్టకు పరకాంతనెపుడు పాపము సోకున్
వట్టిగ నిందలు వేయకు
పుట్టెడు సంసారమీద బూనుము సఖుడా !

12) భగవత్ప్రసాదమే సతి
తగుసేవలు జేయునట్టి తారామణియై
నగుమోమున నిన్నుగొలుచు
పగబూనక మేలుకొనుము పడతిని సఖుడా !

13) నీభార్యతప్ప ఎవ్వరు
నీభారము మోయలేరు నియమముతోడన్
నీభాగ్యముకొలది నెలత
తాభారము మోయుచుండు తప్పక సఖుడా !

14) జననము మరణము పెండ్లియు
మన వశమున నుండబోవు మాధవుడిచ్చున్
తన తనువు నిచ్చు భార్యను
మనసారగ స్వీకరింపు మరువకు సఖుడా !

15) ఎదపైన మగని కామము
ముదముగ తాదీర్చుచుండు ముదితయె ఎపుడున్
ఎదలోని పాలుబిడ్డకు
ముదముగ చన్నిచ్చిపెంచు ముద్దుగ సఖుడా !

16) కష్టము నష్టము చేయదు
ఇష్టము లేనట్టి పనులు ఎవరికినైనన్
కష్టము అనుపించు మదికి
కష్టము లేకున్న సుఖము కలుగదు సఖుడా !

18) రక్షించు వీర్యమెప్పుడు
శిక్షించునదియె పరసతి చెంతకుచేరన్
కక్షలు పెరుగును చివరకు
రక్షణ లేకుండు భార్య రతిచే సఖుడా !

19) కోమలి దేహము దగ్గర
కామంబును కల్గుగాన కాంతలతోడన్
చీమంత చెలిమి చేసిన
ఏమాత్రము పనికిరావు ఇలలో సఖుడా !

20) కాంతకు విద్యయు వచ్చిన
శాంతముగా సాగవచ్చు సంసారంబున్
సుంతయు జ్ఞానము లేనిచో
గుంతలవడి చచ్చినట్లె గుర్తా సఖుడా !

21) యోగిని భోగిగ జేయును
భోగిని యోగిగనుజేయు భువిలోజనులన్
భోగిని కారణమన్నిట
బాగుగ పరికించిచూడ బైలగు సఖుడా !

22) నారిని భారిగజూచిన
కూరల రుచిచెప్పలేము కుదురును వరుసల్
కారణముండక కొట్టిన
పారును పరివారమిడిచి పలుకక సఖుడా !

23) అత్తలు కోడండ్లెప్పుడు
పొత్తుల దినుచున్నగాని పొందరు వారల్
కత్తులపై సాముపగిది
జిత్తులచే మెలగకున్న చెడెదవు సఖుడా !

24) శతకాలు రాసినా బహు
మతులు బడసినా మగువల మాన్యత కొరకున్
సతిసేవలు గోరు మగడు
మతిగలిగియె దిరుగవలయు మహిలో సఖుడా !

25) సతితో సరసము గ్రోలియు
మతిదప్పియు మెలుగకెపుడు మమతయు వదిలీ
అతి దూరమునుండకెపుడు
సతియే సకలంబునీకు సత్యముసఖుడా !

26) నాపెండ్లము మంచిదనుచు
వాపోవుటవెట్టి తనము వలపుల కొరకై
నీపెండ్లమె నిన్ను దులుపు
నీపేరును రచ్చకీడ్చు నిజముగసఖుడా !

27) పక్కింటి వారు సొమ్ములు
ఎక్కువ ధరియించియున్న ఏడ్చుచునీపై
మక్కువ తక్కువ జూపును
నిక్కము నామాటనమ్ము నీవిలసఖుడా !

28) నీవెంతప్రేమజూపిన
నీవెంతయు స్వేచ్ఛనిచ్చి నీతిగయున్నన్
లావైనసొమ్ము కొరకై
బావురుమని యేడ్చుచుండు బలముగ సఖుడా !

29) మైథున సంసారంబున
బాధేమియునుండబోదు భార్యకు ఎపుడున్
జూదరి - సోమరియైనను
బాధలు భరియింపలేదు భయపడు సఖుడా !

30) కోమలి తనువునుదాకిన
కామము జనియింపకుండ కలిగిన రోజే
రాముడు నీవాడేయగు
కామము నశియింపముక్తి కల్గును సఖుడా !

31) సతియేదైవ ప్రసాదము
మతితోడను స్వీకరింపు మర్మముదెలియున్
సతియే స్వర్గము నరకము
మతిగల్గియు దెలిసికొనుము మరువకు సఖుడా !

32) భగవన్నామము దలచిన
జగమందున జీవితంబు చక్కగ జరుగున్
వగవగ పనిలేదు యెపుడు
నగుమోమున కాపురంబు నడపుము సఖుడా !

33) వెంకటరమణుడు భక్తుల
సంకటమెడబాపుచుండు శాంతము తోడన్
పంకజనయనుని నమ్మిన
ఇంకును నీకష్టమెల్ల ఇలలో సఖుడా !

34) దైవము ఒకడే యుండును
సేవలు పలుపేర్లుపెట్టి చేసిన పుణ్యం
భావమును బట్టి నీకున్
జీవితమిలజరుగుచుండు జేతగ సఖుడా !

35) యుగములు ఎన్నియు గడిచిన
జగమును కాపాడువాడు జానకి పతియే
తగుజన్మను నీకిచ్చెను
ఎగతాళిగ దలుప కెపుడు ఎచ్చుట సఖుడా !

36) నామాట వినక పోయిన
ఏమాటలు పనికిరావు ఎన్నటికైనన్
నామము నేమము మరువకు
రాముడు కాపాడునిన్ను రయమున సఖుడా !

37) రామా! కృష్ణా! శివుడా!
నామము ఏదైనగాని నమ్ముము మదిలో
చీమంత కష్టముండదు
ఏమాయెను రామదాసు ఎరుగవ సఖుడా !

38) దైవాధీనము సర్వము
సేవాధీనము సుఖాలు శివునకు నైనన్
నీవెంతవాడ వైనను
సేవించు తరించు మిలను శీఘ్రమె సఖుడా !

39) సాయిని కొలిచినవారే
హాయిని నీకివ్వలేరు అణువంతైనన్
సాయికి ప్రియమగు పనులను
చేయగ నీదరి సుఖములు చేరును సఖుడా !

40) ఎదపైన సాయి చిత్రము
మదిలో వంచించు బుద్ధి మనిషికియున్నన్
విధిగా వదలుము స్నేహము
మదిలో సాయిని దలచుము మరువకు సఖుడా !

41) కమ్మని మాటలు చెప్పియు
సొమ్మంతయు దోచునట్టి క్షుద్రులు ఇలలో
రమ్మన్నను వెళ్ళవలదు
నమ్ముము నామాటనీవు నవ్వక సఖుడా !

42) దాసుల మంచును వచ్చియు
మీసాలను దువ్వుకుంటు మీదికి వచ్చీ
మోసము చేసెడివారిని
నీసాయికి ఒప్పజెప్పు నిజముగ సఖుడా !

# భూతదయ

1) శనివారంబనుచు జనులు
మనసంతయు మాడ్చుకొనియు మాంసముదినకన్
కొనప్రాణంబున కొందరు
తన ప్రేమను చాటుచుంద్రు తగునా సఖుడా !

2) నాలుక రుచికై పశువుల
నేలకు బడవైచికోసి నెత్తురుగారన్
పాలసులవలెను దిందురు
పాలించిన పశువుకండ పాడియె సఖుడా !

3) కొబ్బెర మసాల వేసిన
అబ్బురముగనుండవేల ఆకులకూరల్
డబ్బులనిచ్చియు నరులిట
గబ్బు కబళముదిననేమి కర్మము సఖుడా !

4) భక్ష్యముపై ఈగున్నను
భక్షింపక పారవైచు భాగ్యులు ఇలలో
లక్షలు ఈగలు చచ్చిన
భక్షింతురు మాంసమైతె భావ్యమె సఖుడా !

5) విశ్వమునందలి పశువులు
ఈశ్వర దత్తము భుజించు ఎప్పటి కైనన్
ఐశ్వర్యంబుండినరులు
ఆశింతురు పశువుకండ, అయ్యో! సఖుడా !

6) ఎగిరెడి పక్షుల విడువరు
నగుమోమున నరముబట్టి నరికియు వాటిన్
దగదగ మంటను గాల్చియు
తెగవేసిన ముక్కలన్ని తిందురు సఖుడా !

## చిన్నిమాట

గీ॥ వేదవేద్యులు మద్యంబు వీడకున్న
శాస్త్రవేత్తలు కల్లుచే సంతసించ
సమసిపోవును సత్కీర్తి సత్వరంబె
సహజగుణమది సారాకు చాలవరకు
బుద్ధిమంతులు పుడమిని పూజ్యులైన
గొప్పబలమున్న ధనము సద్గుణములున్న
కల్లు త్రాగిన వారెల్ల కలియుగాన
చెడ్డకీర్తికి దాసులై చెడదురనుచు
చెప్పుచున్నాడు బిచ్చయ్య చిన్నిమాట.

